# శ్రీ రామ శతకము

గ్రంథకర్త్రి: శ్రీమతి కల్లూరి విశాలాక్షమ్మ



వేంకట్రామ అండ్ కో.

బెజవాడ - మద్రాసు

కాపీరైటు ] 1948 [ వెల 0—3—0

శ్రీ ర స్తు

# శ్రీ రామ శతకము.



క. శ్రీజానకీమనోహర
రాజేంద్రవిరాజమాన రాజబిడౌజా
రాజితకీర్తివిశాలా
రాజీవదళాయతాక్ష రాఘవరామా.

క. వైదేహీహృదయేశ్వర 1
యాదిత్యసమప్రకాశ యఖిలాధారా
వేదాంతవేద్య నీశుభ
పాదాబ్జము లాశ్రయింతుఁ బ్రభు! శ్రీరామా. 2

క. ఓకారుణ్యపయోనిధి
నీ కంకిత మాచరించి నే నిడితిఁ బ్రభూ
యీకందపద్యశతకముఁ
గైకొని మ మ్మేలుమయ్య కరుణను రామా. 3

క. కౌసల్యాప్రియనందన
భాసురసుగుణాలవాల పద్మదళాక్షా
శ్రీసీతాహృదయేశ్వర
కోసలపురనాథ దీనిఁ గొను శ్రీరామా. 4

క. కందర్పకోటిసుందర
యిందీవరనీలగాత్ర యినసమతేజా

ఖండనము లొనర్చెద నా
ఖండమ్మున నన్నుఁ బ్రోవు నమ్మితి రామా. 5

క. శ్రీవిఘ్నరాజు మదిలో
సేవించియు శారదాంబ స్థిరమతితోడన్
భావించి యిష్టదేవుల
భావంబునఁ బ్రస్తుతించి వ్రాసితి రామా. 6

క. సురలెల్ల నిన్ను వేఁడిన
ధరణిన్ దశరథనరేంద్రతనయుఁడవయ్యున్
బరమాద్భుతము లొనర్చిన
పరమేశుని నిన్నుఁ బొగడ వశమే రామా. 7

క. అనుజులతోడను దశరథ
జనవిభుసుతుఁడై జనించి జనులు పొగడు స
ద్గుణరత్నాభరణుని నిన్
మనమందున సన్నుతింతు మానక రామా. 8

క. చిరుతగు ప్రాయమునను సో
దరయుతుఁ డగునట్టినీవు తలిదండ్రులకున్
మురిపెము ముద్దులఁ జూప్చుచుఁ
బరమామోదంబుఁ గూర్చుస్వామివి రామా. 9

క. ఇల నెల్ల వేదశాస్త్రము
లలరంగా నభ్యసించి యనుజన్ములతో
విలసిలు నిన్ను నుతించెద
జలజాయతచారునేత్ర జానకిరామా. 10

క. కుశికాత్మజుతో నడవికి
దశరథు పన్పినను బోయి తాటక యనుర
క్కసినిం దునుమాడిన శ్రీ
దశరథరాజేంద్రపుత్ర దయఁ గను రామా. 11

క. గౌతమపత్ని కహల్యకుఁ
బాతకమును బో నడంచి పాషాణంబున్
నాతిని గా నొనరించిన
సీతాధిప నీదు సేవఁ జేయుదు రామా. 12

క. మునికౌశికుయాగంబును
ఘనముగ రక్షించినావు కడుదుష్టాత్ముల్
దనుజుల మారీచాదుల
దునుమాడిన వాఁడ వీవు దురమున రామా. 13

క. ఆనందించి మునీంద్రుఁడు
నానాశస్త్రాస్త్రములను నళినోదర నీ
కానాఁ డొసంగె విద్యలఁ
దా నెన్నో మంత్రములను దశరథరామా. 14

క. జనకధరానాథుఁడు తా
ఘనయాగము నొండొనర్చు కాలములోనన్
ముని నినుఁ గొంపోవుఁడు నా
జనకుఁడు మన్నించె నిన్ను జనపతి రామా. 15

క. అవలీల శివునివిల్లున్
దివిజులు వినుతింప విఱిచితివి నీ వపుడ

య్యవనీసుతఁ బెండ్లాడిన
యవనీశ్వర నిను నుతింప నలవియె రామా. 16

క. జానకిసమేతుఁ డయ్యును
నానందముతో నయోధ్యయం దుండిననిన్
మానవనాథాగ్రణి నే
మానసమున నెంతుఁ బ్రోవుమా శ్రీరామా. 17

క. కైకకు వరము లొసంగిన
భూకాంతునియాజ్ఞఁ బొంది భూమిజ ననుజున్
గైకొని వనుల కరుగుసు
శ్లోకుని నినుఁగొల్తు లోకసుందర రామా. 18

క. భరతుఁడు రాజ్యమునకు నిన్
నరుదెమ్మని వేఁడ నీవ యాతనిమాటన్
నిరశించి పురికిఁ బోవక
వరపాదుక లిచ్చి యనుజుఁ బంపితి రామా. 19

క. జాయానుజయుక్తుఁడ వై
పాయక సత్యవ్రతంబు పదునాల్గేడుల్
కాయక్లేశము లోర్చుచుఁ
జేయుదు వనవాస మంటి శ్రీరఘురామా. 20

క. సీతాసౌమిత్రులతోఁ
బ్రీతిని నత్ర్యాశ్రమంబు వేంచేసిననీ
ఖ్యాతినిఁ బొగడె మునీంద్రుం
డాతనిసతి కాన్క లిచ్చె నతివకు రామా. 21

క. అలదండకావనములో
ఖలుఁ డైనవిరాధుఁ జంపి కడుదుర్మతి యా
నలశూర్పణఖకుఁ గినుకన్
గలిగించితి పరిభవమ్ము గదె శ్రీరామా. 22

క. ఖరదూషణాదు లసురులు
దురమునఁ బదునాల్గువేలఁ దున్మాడితివో
ధరణీశ నీప్రభావము
తరమగునే వినుతిఁజేయ దశరథరామా. 23

క. పంచవటీతీరమున ర
చించితి వొకపర్ణశాల సీతాసతితో
నెంచఁగ లక్ష్మణుతోడ వ
సించితి వచ్చోట నీవు స్థిరముగ రామా. 24

క. జానకిసుందరరూపము
దానవనాథుండు వినియు దశకంధరుఁ డా
జానకిని నపహరింపఁగ
మానసమునఁ దలఁచె దుష్టమతియై రామా. 25

క. తనపూర్వమంత్రి మారీ
చునిఁ గని రావణుఁడు పల్కె క్షోణిజఁ దెత్తున్
జనుదెమ్ము సహాయం బన
ననుమానించియును వచ్చె నాతఁడు రామా. 26

క. నీమహిమ మెఱుఁగుఁ గావున
దా మోక్షము నొందఁ గోరి తగ నీచేతన్

నామారీచుఁడు వచ్చె మ
హామాయామృగము నయ్యె నప్పుడె రామా. 27

క. కనకపుఁ గురంగమై యా
జనకజఁ గనుఁగొనఁగఁ బర్ణశాలకు ముందా
దనుజుఁడు నాట్య మొనర్చిన
జనకజ తెమ్మనియె దాని జనపతి రామా. 28

క. వైదేహి కోరుకోరిక
మోదంబునఁ దీర్పనెంచి భూమిజ నీకున్
నేఁ దెచ్చి యిత్తు నని నీ
సోదరు నట నిల్పి పోతి సుందరరామా. 29

క. కనకమృగంబును బట్టఁగ
ధనువుం గైకొనియుఁ బోయి దానవమాయన్
గని తత్క్షణంబులో నా
కనకమృగముఁ గూల్చి తీవు కదె రఘురామా. 30

క. ఆమారీచాసురుఁడున్
స్వామీ నీస్వరముతోడఁ జయ్యన నఱవన్
భూమిజ విని నీదరికిన్
సౌమిత్రినిఁ బంపెఁ గాదె జనపతిరామా. 31

క. సమయంబును గనిపట్టియు
యమివేషంబును ధరించి యసురేశ్వరుఁ డా
క్షమసుత దరికిం జని భి
క్షము వేయు మటంచుఁ గోరె ఖలుఁడై రామా. 32

క. ఆతఁడు నిక్కపుముని యని
సీతాబ్జానన తలంచి శీఘ్రమె భిక్షం
బాతని కిడు నంతట నా
ఘాతుకుఁడు నిజంబు రూపుఁ గైకొనె రామా. 33

క. తనరూపము గాంచియు మూ
ర్ఛను మునిఁగినధరణిసుతను రథమున నిడియున్
గొనిపోయె గగనవీథిని
దనలంకాపురమునకును దనుజుఁడు రామా. 34

క. ఆలంకాపురమందున్
బాలామణి నొక్కశింశుపాతరువుకడన్
ఆలోన నుంచి దనుజుఁడు
వేలకువే ల్కావలుంచె వెలఁదుల రామా. 35

క. అంతట నరణ్యమున నా
కాంతను విడనాడి రాఁగ గని లక్ష్మణు నీ
వెంతేని మందలించియు
నింతి నరయఁ బర్ణశాల కేగితి రామా. 36

క. జనకాత్మజాత నెవ్వఁడో
దనుజుఁ డపహరించె ననియుఁ దలఁచియు నీ వా
యనుజునితో దక్షిణదిశ
జనియుంటివి దైన్యమునను జానకిరామా. 37

క. ఆమార్గమున జటాయువు
భూమిజకై దనుజుతోడఁ బోరినవానిన్

భూమిఁ బడియున్నవ్వానిని
బ్రేముడిఁ గన్గొంటి వీవ శ్రీరఘురామా. 38

క. ఆతనివలనను నీవా
సీతావృత్తాంత మెల్ల శీఘ్రము విని నీ
వాతనికి మోక్ష మొసఁగియు
ఖ్యాతమ్ముగ నిఁక నూరిపోతి నృపవర రామా. 39

క. అలశబరి పరమభక్తిని
ఫలముల నర్పించె నీకు వగఁ దమ్మునితో
ఫలముల భుజించి యామెకుఁ
గలిగించితి వీవు ముక్తిఁ గదె శ్రీరామా. 40

క. సాలము లేడుం గూల్చియుఁ
బోలఁగ దుందుభిశరీరమును దూరముగాఁ
గాలం జిమ్మి యొకమ్మున
వాలిం బడఁగూల్చితీవు పావన రామా. 41

క. ఇనసుతునితోడ సఖ్యముఁ
బొనరిచి వాలిని వధించియును దద్రాజ్యం
బినతనయునకు నొసఁగియు
ననువుగఁ బాలించితీవ యనఘా రామా. 42

క. హనుమానునిచే సీతా
వనజానన కానవాలుఁ బంపియు నీ వా
జనకాత్మజఁ దెచ్చుటకై
యినజునసహాయంబు గోరితెంతయు రామా. 43

క. భూమిజ యశోకవనమున
క్షేమంబున నున్నవార్తఁ జెచ్చెర వినియున్
సౌమిత్రిసమేతుఁడవై
యామోదించితివి కువలయాధిప రామా. 44

క. బలగం బెల్లను గూడుక
జలజాప్తతనూజుతోడ శ్వాసనజుతోడన్
అలఘుఁడు సీతమ్మనిలో
లలిని బయల్వెడలి తీవు లంకకు రామా. 45

క. ఆవారిధిమధ్యంబున
భూవర సేతువునొకండు పొల్పొరలారన్
వేవేగమ నిర్మించితి
దేవా నీమహిమ నాకుఁ దెలియునె రామా. 46

క. శరణుం గోరినవానిని
దురితాత్ముం డగ్రజన్ము దోషాచరునిన్
నిరసించి వచ్చునతనిన్
శర ణిచ్చి విభీషణాఖ్యు సాకవె రామా. 47

క. వానరబలములతోడన్
జానకికై లంకకేగి సంగరమందున్
దానవవీరులఁ దున్మిన
మానవపతి నినుఁ దలంతు మదిలో రామా. 48

క. లంకాపట్టణమున ని
శ్శంకన్ నీసైన్య మల నిశాచరబలమున్

కొంకకఁ జెండాడెదవనే
వంకన్ జయ మయ్యె నీకుఁ బ్రభువర రామా. 49

క. ఆహవరంగములో నీ
వా హనుమత్స్కంధ మెక్కి యసురాగ్రణులన్
బాహాబలమున దున్మిన
శ్రీహరిదివ్యావతార సీతారామా. 50

క. బలవంతుఁడైనవానిని
బలుగాకినిఁ గుంభకర్ణుఁ బవరములో నీ
విలుఁ గూల్చి వైచి నాఁటవు
జలజోదర నిన్నుఁ బొగడ శక్యమె రామా. 51

క. మాయావి యైనవాని న
మేయబలుం డైనవాని మిగుల దురాత్మున్
నాయింద్రజిత్తు ననిలో
నీయనుజుఁడు సంహరించె నృపవర రామా. 52

క. దశకంధరుఁ డప్పుడెంతయుఁ
బ్రశస్త మగునరద మెక్కి ప్రభునీపైనన్
విశిఖంబుల వైవఁగ నా
దశముఖుతోఁ బోరితీవ దశరథ రామా. 53

క. ధరణిని నిల్చినరఘుభా
వర నీవును రథియు నైన పంక్తిముఖాసురున్
దుర మొనరింపఁగఁ గాంచియు
సురపతి తేరంపె నీకు సుందర రామా. 54

క. మాతలిచేతను గడుఁకం
ప్రీతిని బంపించినట్టివిమలరథంబున్
తన్మాతలపతి వపు డెక్కియు
నాతఱి సల్పితివి నీవ యాలము రామా. 55

క. దేవతలెల్లరు నీ వా
రావణుతోఁ బోరు టంబరమున నిలిచియున్
భూవర చూచుచు నిన్నున్
దీవించుచు నుండి రప్పుడు తెలియఁగ రామా. 56

క. ఆదిత్యహృదయమంత్రం
బాదరమున నాయగస్త్యుఁ డపుడు తెలుప నీ
వాదిత్యుని సేవించియు
నా దేవుననుగ్రహంబు నందితి రామా. 57

క. తనవంశభూషణుఁడ వని
మనమున హర్షించి యంశుమంతుఁడు నీకున్
దననిజదర్శన మొసఁగియు
దనుజేంద్రుని గెల్తు వనియె దశరథరామా. 58

క. సూర్యానుగ్రహ మొందిన
సూర్యకులాభరణుఁ డీవు శూరాగ్రణి వై
ధైర్యోత్సాహం బలరఁగ
శౌర్యంబున సంగరమ్ముఁ జల్పితి రామా. 59

క. బ్రహ్మాస్త్రము మంత్రించియు
బ్రహ్మకులజుఁ డైనపంక్తిరదనునిపై నన్

బ్రహ్మాదిదివిజసన్నుత
బ్రహ్మాండం బలర నీవు వైచితి రామా. 60

క. నీయస్త్రమహిమవలనన్
మాయావి దశాననుండు మహిపైఁ గూలన్
శ్రీయుతుఁ డగునీ కెల్లరుఁ
జేయుదు రభివాద మపుడు సీతారామా. 61

క. సురలెల్ల సంతసించియు
దురితాత్మునిఁ బంక్తిముఖునిఁ దున్మిననీపై
గురిసిరి పూవులవానను
జరితార్థుఁడ వైననీప్రశంసయె రామా. 62

క. అనిమొన విజయుఁడ వగునిన్
గనుఁగొన నేతెంచి దేవగణ మెల్లను వం
దనముల నొనర్చి స్తోత్రం
బునొనర్చిరి భక్తలోకపూజ్యుఁడ రామా. 63

క. మనుజావతారమై నీ
వనిమిషకార్యంబొనర్ప నవనీస్థలిలో
జనపతిదశరథునింటను
జనియించితి రాముఁ డనఁగ శౌరివి రామా. 64

క. నీవు విభీషణు నప్పుడు
రావణు రాజ్యంబునందు రాజేంద్రునిఁ గా
నీ వభిషేకించితివో
దేవా నీదగుప్రతిజ్ఞఁ దీరఁగ రామా. 6

క. అప్పుడు విజయము సీతకుఁ
జెప్పుటకై యాంజనేయుఁ జేరియు నటకున్
జప్పున నీ వంపించిన
నప్పావనగాత్రి హర్షమందెను రామా. 66

క. బవరమున గెలుచుని న్నా
యవనిజ కనుగోఁ దలంచి యాజ్ఞను వేఁడన్
బవమానతనయుఁ డంతట
నవనిజకోరికను దెల్పె నప్పుడె రామా. 67

క. అనుమానించియు నీవున్
మనమందునఁ జింతఁ బొంది మైథిలిఁగొని తె
మ్మని యవ్విభీషణున కా
జ్ఞ నొసంగితి వంతలోన జానకిరామా. 68

క. పరమపతివ్రత యగునా
ధరణీనందనను దెచ్చి దనుజేంద్రుఁడు తాఁ
ద్వరితమె నీకర్పించెను
బరమామోదమున నపుడు ప్రభు శ్రీరామా. 69

క. ఆసమయంబున నీ వా
త్మేసుతఁ గోపమునఁ గాంచి మైథిలి నీపై
నాసను నే విడనాడితి
నోసఖి నినుఁ బాసి తంటి వో రఘురామా. 70

క. పరకాంతాసక్తుం డగు
దురితుఁడు రావణునియింటఁ డోయలి నీవున్

చిరకాలము వసియించితి
చెరుపడ నీశీలమంటి శ్రీరఘురామా. 71

క. నీపలుకులు శ్రవణములకు
భూపుత్రికి ములుకు లయ్యె మూర్ఛ మునింగియున్
తాప్మైపైనను బడి కొంతకు
నాపావనగాత్రి యిట్లు లనె శ్రీరామా. 72

క. నీనామస్మరణములో
మేనం బ్రాణముల నిల్పి మిహిరకులేంద్రా
నే నసురుం గోరుదు న యని
జానకి వచియించె నీకు జగదభిరామా. 73

క. అనల ప్రవేశ మొనరిచి
మనమున నున్నట్టిశంక మాన్పెద నని యా
జనకజ నీకును మ్రొక్కియు
ఘనవహ్నిం జొచ్చె నపుడు కనుగొన రామా. 74

క. పావని యగుభూనందన
పావకునిం జొచ్చినంతం బరిశుద్ధుండై
పావకుండు తెచ్చి సీతా
దేవిని నీకొసంగె దేవ దేవుడ రామా. 75

క. పాతివ్రత్యంబునం బ్ర
ఖ్యాతిం గైకొన్నమహిజ కామిని యగునే
భూతలనాథా యని సం
ప్రీతిని వచియించె వహ్ని వేగమ రామా 76

క. నీతండ్రి దశరథుండును
భూతలమున కరుగుదెంచి పుత్రవరేణ్యా
సీతను గైకొను మనియును
నీతో వచియించెఁ గాదె నృపవర రామా. 77

క. పంకరుహసంభవుండును
శంకరుఁడును సర్వసురలు చనుదెంచియు నీ
శంకను నశింపఁ జేసియుఁ
బంకజముఖి నేలు మనియుఁ బల్కిరి రామా. 78

క. జానకిశీల మెఱింగియు
మానవవర యిట్లొసర్చి మహియం దెంతో
జానకికిఁ గీర్తి గూర్చితి
మానితయశుఁడైననీవు మాప్రభురామా 79

క. సీతాసతి నూరార్చియుఁ
బ్రీతిని మన్నించి నీవు ప్రియసతి నే నీ
పాతివ్రత్య మెఱింగియె
యీతీఱునఁ జేతు నంటి వెంతయు రామా. 80

క. భూమిజను స్వీకరించియు
సౌమిత్రిసహితుఁ డీవు సమరవిజయుఁడై
యామోద మొందుచుంటివి
కామితమందార నీవు ఘనుఁడవు రామా. 81

క. అంతటఁ బుష్పకయానము
నంతసమునఁ దెచ్చి యానిశాచరుఁ డొసఁగన్

గాంతానుజులం గూడుక
సంతసమున నెక్కితీవు స్వామివి రామా. 82

క. దనుజులు కపులుం గొల్వఁగ
ననుజునితో సీతతోడ నాయానమునన్
దినకరునిఁ బోలెఁ వెల్గుచు
జనియుంటి వయోధ్య కీవు జానకిరామా. 83

క. సాకేతపురికి జన నీ
వాకౌసల్యాదిమాత లందఱుఁ గని నీ
రాకం గోరెదు దమ్ములుఁ
బ్రాకటముగఁ గాంచి తీవ రాఘవరామా. 84

క. ఇనవంశాబ్ధి హిమాంశునిఁ
జనకసుతాజీవితేశు సద్గుణనిధినిన్
ఘనరాజ్యమందు నను నీ
యనుజులు పట్టంబుఁ గట్టి రప్పుడె రామా. 85

క. సీతాసమేతుఁడవునై
పీతమ్ములతోడఁ గూడి నిజరాజ్యంబున్
గౌతుకమునఁ బాలించుచు
ఖ్యాతిం గాంచితివి నీవు ఘనుఁడవురామా. 86

క. జనకాత్మజాహృదీశ్వర
జనులను నీబిడ్డ లట్లు సాఁకుచు రాజ్యం
బును బదివేలేడులు ప్రో
చిననీకు నమస్కరింతు శ్రీరఘురామా. 87

క. కాకుత్థ్సవంశరత్నమ
నీకాళుల ధూళి నయ్యు నిలిచెద నన్నున్
గైకొని పరిపాలింపవె
సాకేతపురాధినాథ జానకిరామా. 88

క. శిక్షింతువు దురితాత్ముల
రక్షింతువు శరణుఁ గోరుప్రజ నెల్లర నో
పక్షీంద్రవాహనా నను
రక్షింపఁ దలంపవేల రఘుపతి రామా. 89

క. భువనాధిపుఁ డీవనుటకు
భవునిశరాసనము విఱుచుబాహుబలంబే
యవనీశ సాక్షి యగు నీ
ప్రవిమలమాహాత్మ్య మెన్న వశమే రామా. 90

క. పత్రఫలపుష్పతోయము
లిత్తు మహీజనులు భక్తి నెల్లర నీవున్
మిత్రముయి ప్రోతు దశరథ
పుత్రా న న్నేల నీవు ప్రోవవు రామా. 91

క. శ్రీమంతంబు సనాతన
మై మహిమాన్వితము నయ్యు నవనీసుతతో
నామోదప్రదము భవ
ద్రామాకారంబు నకును బ్రణతులు రామా. 92

క. రా యని పల్కనఘంబులు
బో యెడు వెలుపలకు జిహ్వామూలము గాఁగన్
మా యని పల్కఁ గవాటము
వేయువిధం బనియు నేను వింటిని రామా. 93

క. రామస్మరణములోనిమ
నామహిమం బెఱిఁగి యేను నత్యతిభక్తిన్
రామాయణము రచించియు
స్వామీ నీ కిచ్చియుంటి జానకిరామా. 94

క. సేతువుఁ గట్టెడువేళను
సీతాధిప యుడుత చిన్నిచేతులతోడన్
ప్రీతిని దెచ్చెను సైకత
మాతటి సంప్రీతి దాని నరయవె రామా. 95

క. వ్రతములు నుపవాసంబుల
సతతము నీయందు భక్తిసల్పక పోతిన్
క్షితినాథ చంద్ర నన్నే
గతి రక్షించెదవో నీవు కరుణను రామా. 96

క. ధర్మము లొనర్పఁ జాలను
నర్మిలితో బీదజనుల నారయఁ జాలన్
ధర్మవిచారుఁడ వగునీ
వర్మిలి నన్నేలుమయ్య యచ్యుత రామా. 97

క. దురితములు పెక్కొనర్చితి
నరయఁగ సుకృతం బొనర్ప నైతిని నేనో
పరమాత్మ భక్తవత్సల
శరణొందితి నన్ను దయను సాకవె రామా. 98

క. గురువులకు నాపకారణ
గురుఁ డౌదువు వేల్పులెల్లఁ గోరఁగ నీవీ
ధరణిని జన్మించినశ్రీ
హరి వగుదువు నిన్నుఁ బొగడ నలవియె రామా. 99

క. భక్తార్తిహరుఁడ వందురు
భక్తశరణ్యుండ వనియుఁ బల్కుదు రార్యుల్
భక్తిని నిది యొసఁగితి నా
సక్తిం గ్రహియించి నన్ను సాకవె రామా. 100

క. నాతప్పు లెల్ల మఱచియు
నోతండ్రీ యిది గ్రహించియును బరమేశా
ప్రీతిని నను రక్షింపవె
సీతాలక్ష్మణసమేత శ్రీరఘురామా. 101

క. నీకంకిత మిడి వ్రాసితి
నాకుం గలభక్తితోడ నలినేక్షణ నీ
వీకృతిఁ గైకొని నన్నుం
బ్రాకటముగఁ బ్రోవు భక్తవత్సల రామా. 102

క. సకలజగదంతరాత్ముఁడ
వకలంకుఁడ నైననీపదాంబుజములపై
సకలేశ మనము నుంచెద
బ్రకటితముగఁ బ్రోవుభక్తవత్సల రామా. 103

క. కవిసార్వభౌమపుత్రిక
ను విశాలాక్షియనుపేర నొనరినదానన్
గవితగతిమెఱుఁగఁ జేసితి
నవనీశ్వర శతకమందు మచ్యుతరామా. 104

గద్యము

ఇది శ్రీకల్లూరివిశాలాక్షి ప్రణీతము.

శ్రీరామార్పణమస్తు

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు

శ్రీకృష్ణరామాయణమహా గ్రంథమును శ్రీమానాయన గారివలనఁ గృతిగ్రహణం బొనర్చి మహోత్సవము సలిపిన శ్రీయాదరవేంకట్రావుపంతులుగారు మమ్మెల్లరఁ దమగృహమునకు నాహ్వానించిరి. అయోధ్యాపురంబునందలిరామమందిరముం బోలినవారి మందిరమునఁ గృతిమహోత్సవమును రామపట్టాభిషేకమహోత్సవమును దినదినము రామాయణపఠనమును గావించిరి. దానన నాకు మహానందము గలిగినది. నిరతాన్నదానాదులును దానధర్మాదులును జేయుచుండిన శ్రీపంతులుగారును వారిధర్మపత్ని యగుశ్రీసుబ్బమాదేవిగారును నాకు సీతారాములవలెఁ దోచుచుండిరి. రామభక్తాగ్రగణ్యు లగు శ్రీవారి రామభక్తి యసామాన్యమైనది. వా రనేకరామకావ్యముల రచింపఁజేసి ముద్రింపించిరి. అనేక రామకోట్లు రచించి యెల్లరచే రచింపఁజేసి రామానుగ్రహపాత్రులైరి. వారిదంపతుల ధర్మకార్యము లెన్నియో చూచి వారింట నున్నదినములలో నేనమందానంద మొంది శ్రీవారికి నారచించినయీచిన్ని శ్రీరామశతకమును కానుకగా సమర్పించుకొంటిని. శాంతస్వభావులు దయామృతసమేతులు విద్యాపోషకులు భూసురప్రభువులు నగు శ్రీపంతులువారు శ్రీరామశతకము నత్యంతానందముతో నిట్లు ముద్రించి ప్రకటింపఁ జేసిరి. పుత్రికాప్రేమ నాపైఁ జూపిన శ్రీయాదరవేంకటరాయదంపతులకుఁ బరమేశ్వరుఁ డాయురారోగ్యైశ్వర్య పుత్రపౌత్రాభివృద్ధి నొసంగుఁ గాక యని ప్రార్థించుచున్నాను.

ఇట్లు

క. విశాలాక్షమ్మ.

